# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

## ధ్యానం

**మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యువానమ్**
**వర్షిష్ఠాన్తేవ సదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః**
**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం**
**స్వాత్మారామం ముదిత వదనం దక్షిణామూర్తి మీడే 1**

తా. ఆత్మ నిష్ఠుడై ప్రసన్న వదనంతో మౌనంగా చిన్ముద్రాంచిత హస్తంతో, వేద విదులైన వయోవృద్ధులైన మహర్షులకు ఆత్మ విద్యను అతీత పద్ధతిలో సంకేతముల ద్వారా బోధిస్తున్న యువ గురువు శ్రీ దక్షిణామూర్తిని నేను ఆరాధిస్తున్నాను.

**వటవిటపి సమీపే భూమిభాగే నిషణ్ణం**
**సకల ముని జనానాం జ్ఞానదాతార మారాత్**
**త్రిభువన గురు మీశం దక్షిణామూర్తి దేవం**
**జనన మరణ దుఃఖచ్ఛేద దక్షం నమామి 2**

తా. మఱ్ఱి చెట్టు క్రింద కూర్చొని తన చుట్టూ ఉన్న మహర్షులకు ఆత్మవిద్యను అందిస్తూ జనన మరణాలతో కూడిన సంసార దుఃఖాలను నిర్మూలిస్తూ ముల్లోకాల చేతనూ గురువుగా కొలవబడే శ్రీ దక్షిణామూర్తికి నమస్కృతులు.

**చిత్రం వటతరోర్మూలే వృద్ధాః శిష్యా గురుర్ యువా**
**గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః 3**

తా. ఆహా! ఎం ఆశ్చర్యకరం! యువకుడైన గురువు చుట్టూ వృద్ధులైన శిష్యులు శ్రద్ధా భక్తులతో కూర్చొని ఉన్నారు, గురువు తన మౌనంతోనే వారి సర్వ సందేహాలనూ నివారింపగలుగుతున్నాడు.

**నిధయే సర్వవిద్యానాం భిషజే భవ రోగిణామ్**
**గురవే సర్వ లోకానాం దక్షిణామూర్తయే నమః 4**

తా. భవరోగ బాధితులకు వైద్యుడై జగద్గురువై, జ్ఞాన స్వరూపంగా ప్రకాశించే దక్షిణామూర్తికి నా నమస్కృతులు.

**ఓం నమః ప్రణవార్థాయ శుద్ధ జ్ఞానైక మూర్తయే**
**నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః 5**

తా. నిత్యశుద్ధుడై, ప్రశాంత స్వరూపుడై, శుద్ధ జ్ఞానమే మూర్తిగా, ప్రణవ నాదమైన ఓంకారానికి లక్ష్యార్థంగా భాసిస్తూ, నిర్మలుడైన దక్షిణామూర్తికి నా నమస్కృతులు.

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం**
**పశ్యాన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మాన మేవాద్వయం**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 1**

నామరూపాత్మకమైన ఈ సర్వజగతినీ, ఆత్మ చైతన్యమయిన తనలో లీలా మాత్రంగా, స్వానుభవంగా, స్వాత్మగా, అద్దంలో కనిపించే నగరం వలె, స్వప్న దృశ్యం వలె తనకంటె భిన్నంగా ఉందన్న భ్రమకలిగిస్తోందని గుర్తిస్తున్న జగద్గురువైన శ్రీ దక్షిణామూర్తికి నా నమోవాకాలు.

**-:వివరణ:-**

"**విశ్వం దర్పణ దృశ్యమాన**...." - అద్దంలో వున్న ప్రతి బింబం ఎలా కనపడుతూనే అవాస్తవముగా ఎలా వుందో, అలాగే విశ్వం కూడా ప్రతిబింబ సమానము. మరి కనపడుతున్న విశ్వము లేనిది అంటున్నాము. అసలు నిజం ఎలా వుంది? ప్రతిబింబానికి బింబం వుండాలి కదా!

**నిజాంతర్గతం**: ఈ విశ్వం లోపల నిజంగా ఏమి వుంది?

పశ్యన్నాత్మని మాయయా: **పశ్యన్** = చూడటం.

ఈ విశ్వం లోపల, అంతటా ఆధారం ఆత్మ అంటే బయటకు లేని విశ్వం ఎలా వచ్చింది?

**మాయయా**: మాయ వల్ల వచ్చింది.

**బహిరివోద్భూతం యథా నిద్రయా**: నిద్రపోతున్నప్పుడు పంచభూతాల ఎరుక లేదు. కానీ పంచ భూతాలు వాస్తవంగా లేవా? ఉన్నాయి.

ఈ అనంత విశ్వం ఆత్మస్థితిలో ఎలా వుంది?

ఆత్మ దృష్టితో వుంటే విశ్వం కన్పడటం లేదు. విశ్వం వున్నదనే దృష్టితో చూస్తే ఆత్మ తెలియదు.

**నిద్రపోతున్నవాడికి, మెలకువలో వున్నవాడికి భేదం ఏమిటి?**

ఆ నిద్ర నుండే మేలుకున్నావు. కానీ మెలకువలో నిద్ర గురించి తెలియదు. నిద్రలో మెలకువ గురించి తెలియదు. నిత్యజీవితంలో ఇది ఎంత సత్యమో, అలాగే ఈ విశ్వం అంతా వుంది అనీ, భోగ్యవస్తువుగా చూసినప్పుడు ఆత్మ తెలియదు అనే విషయం కూడా అంతే సత్యం. ఇలా తెలుసుకో!

మెలకువలో నిద్ర ఎక్కడకు పోయిందో, నిద్రలో ఈ మెలకువ ఎక్కడకు పోయిందో అదీ తెలీదు. రెండూ మనమే చేస్తున్నాము. కాబట్టి విచారణ చేయాలి. మెలకువ ఎక్కువ సేపు, నిద్ర కొద్దిసేపే కాబట్టి నిద్రను పోగొట్టుకోవాలి. ఏది వస్తుందో అది పోవాలి.

ఈ అనంత విశ్వం పుట్టక ముందు నుండి ఆత్మ వుంది. విశ్వం వస్తోంది. కాబట్టి విశ్వమే పోతుంది. (అలా) మెలకువకు రాకడ పోకడ లేదు. అది ఎపుడూ ఉంటోంది. అలాగే ఆత్మ ఎపుడూ వుంటుంది. నిద్ర అంటే అజ్ఞానం, కాసేపు వుంటుంది, పోతుంది. నిద్రలో నీదైన తెలివిని, నీదైన స్థితినీ కోల్పోతున్నావు కదా! మెలకువలో వున్నంత సేపు నీవు ఏదైతే అయివున్నావో ఆ తెలివి నీకుంది. "**రాను ఎటులో, పోను ఎటులో... అయినదెటులో కానిదెటులో...**" ఎరుక వుంది. అది పోదు. రావడం అంటే పోవడం కనపడుతుంది. అనంత విశ్వం వచ్చింది, పోతుంది. మనం దేని గురించి చింతన చేయాలి? రాకడ, పోకడ లేని స్థితి ఒకటి వుంది. దాన్ని గురించి చూడాలి. ఈ దృష్టి కోణంతో చూడాలి. రానిది, పోనిది గురించి విచారణ చేయాలి.

బాల్యం, కౌమారం, యవ్వనం, వృద్ధాప్యం మొదలైన దశలు, అవస్థలు వస్తూ వుంటాయి, పోతూ వుంటాయి. శరీరం వస్తుంది, పోతుంది. కానీ నీవు పోవు. సృష్టి సామాన్య ధర్మంగా రావడం పోవడం వుంది. దీనిని ఏమీ చేయలేము. ఈ రావడానికి, పోవడానికి ఆధారమైన స్థితిలో వున్నదానికి రాకడ, పోకడ ప్రభావం లేదు. నీలో నేను అనేది వుంది. దీనికి రాకడ, పోకడ ప్రభావం లేదు. నీ జీవన ప్రమాణంతో చూస్తే అనంత విశ్వం ఎక్కువ. కానీ పోతుంది. పగలు, రాత్రి భూమి మీద వున్నవారికి ఉన్నాయి కానీ సూర్యునికి లేవు కదా! సాపేక్ష దర్శనం వున్నవారికి పగలు, రాత్రి వున్నాయి. లేకపోతే లేవు.

ఇవన్నీ అభ్యాస పూర్వకంగా వచ్చాయి. అనంత విశ్వాన్ని ప్రతిబింబ సమానంగా చూడాలి. ఈ అనంత విశ్వాన్ని గుర్తించినంత సేపు వుంది. లేకపోతే లేదు.

ప్రపంచం వుంటే complaints అన్నీ వుంటాయి. (అద్దం ముందు నిలబడితేనే కదా ప్రతిబింబం కనపడింది). అది నీ వద్దకు రాదు కదా! అంతే కదా!

మరి ఆ ప్రపంచాన్ని ఎవరు గుర్తించమన్నారు?

అది అలా అభ్యాసంతో జరుగుతోంది.

(అద్దంతో పని లేకుండా వుండలేమా? నిన్ను నీవు సరిచేసుకోవడానికి ప్రతిబింబం అవసరం. అలంకరణ అనే దృష్టి లేకపోతే అద్దం అవసరం లేదు).

పూర్వము ఏదీ లేకపోయినా ప్రశాంతంగా వున్నారు. ఇప్పుడు వస్తు భోగ్య దృష్ట్యా తెలివి పెరిగింది. కానీ అన్నీ వున్నా ప్రశాంతతను కోల్పోయారు. ఏదైనా విషయాసక్తత ఎపుడూ వుంటుందా? వస్తుంది, పోతుంది. ఈ ప్రపంచం అంతా ఒకే సూత్రం మీద వుంది. ఏదైనా వస్తే పోక తప్పదు. ఈ సత్యాన్ని గుర్తించాలి. అందుకే నిద్ర, మెలకువల పోలిక. నిద్రవలే ఈ ప్రపంచం, దానికి సంబంధించిన విషయాలు కూడా పోక తప్పదు.

"**తుల్యం నిజాంతర్గతం బహిరివోద్భూతం**" –

నీకు నిద్ర మెలకువ లాగా అన్నీ ఈ ప్రపంచంలో వస్తున్నాయి. వస్తే పోతాయి. ఈ జీవన సత్యాన్ని గుర్తిస్తే no complaints. అద్దంలో వున్న ప్రతిబింబం మీద complaint చేస్తే అదేం చేస్తుంది.

మరి నీవు ఒక్కడివే వుండీ, రెండోవాడు లేనప్పుడు complaints ఎవరి మీద? అనంత విశ్వము నీ యొక్క ప్రతిబింబమే. ఎవరో లేరు. నీవే!

నీ ప్రతిబింబము మీద ఎలా complaint చేస్తావు?

ఆ ప్రతిబింబానికి వాస్తవంగా ఉనికి లేదుగా. ఉన్నట్లు కనపడుతుంది. ప్రపంచ దృష్టితో చూస్తే ఇవి వుంటాయి. ఆత్మ దృష్టితో వుంటే ఏకోనారాయణగా రెండోవాడు లేడు, ఇక సమస్య లేదు. దీనికి మన దృక్పథం మారాలి.

**యోగనిద్రలో పరవశుడై వున్న నారాయణుడికి సమస్య వుందా?**

లక్ష్మీ దేవి అంటే ఐశ్వర్యం, భోగ్యవస్తువు.

యోగ నిద్రా పరవశుడైన వాడికి భోగ్యవస్తువు సేవ చేస్తుందని అర్థము.

అంటే నీవు యోగనిద్రా పరవశుడవై వుంటే ప్రపంచమే నీకు సేవ చేస్తుంది.

**యోగనిద్ర**: నిద్ర, మెలకువ అనే రెండు స్థితులను అధిగమించి వుండడం. అపుడు ఆత్మస్వరూపుడుగా వున్నాడు. నిన్ను ఆత్మస్వరూపులుగా వుండమని చెప్తున్నారు. పాల కడలి అంటే హృదయస్థానం. నీ కొక జ్ఞాన లక్ష్యాన్ని, యాగ లక్ష్యాన్ని సూచనగా బోధించేందుకు ఇలా కల్పించారు. చిన్నప్పటి నుండి చూస్తున్నాం. ఈ పాలకడలి కాల్పనికత. అప్పుడు భక్తి దృక్పథంతో చూశాము. అప్పుడు తాత్విక దృక్పథం లేదు, వుండదు. అప్పుడు బుద్ధి వికాసం లేదు. ఇప్పుడు పొందిన బుద్ధి వికాసంతో ఇది తెలుసుకోవాలి. యోగమంటే ఇది తెలియాలి. లేకపోతే యోగం వృథా కదా!

84 లక్షల జీవరాశులలో వేటికీ మానవులను తప్ప ఈ ధ్యానయోగాలు లేవు కదా! మనం కూడా ఆ జీవరాశులలో భాగమే కదా! వాటికి లేని problem మనకు ఎందుకు వచ్చింది? సుఖదుఃఖాలు, ఆకలిదప్పులు, వంశోత్పత్తి అన్నీ common కదా!

వివేకము, ప్రశ్నించటము తప్ప వేరే భేదం ఏమీ లేదు. ప్రపంచంలో ప్రశాంతముగా జీవించటానికి అవే నీకు బోధిస్తున్నాయి. వాటి వాటి మధ్య complaints లేవు. మనుష్యుల మధ్య complaints వస్తున్నాయి ఎందుకని అంటే నేను different అనుకోవడంలో వస్తుంది. Common అని నిన్ను నీవు ఒప్పించ కలిగితే no problem. నీ చింత అంతా పోయింది. అప్పుడు నీ మేధాశక్తిని ఎటు కావాలంటే అటు వాడుకుంటావు. ప్రపంచంలో వున్న complaints పోతాయి. సమస్యలన్నీ ప్రపంచాన్ని చూస్తూ వుంటేనే. ఏ రోజుకారోజు ఎంతవరకూ అవసరమో ఆయా వ్యవహారంలో అంతవరకూ ఉంటే ఏమీ లేదు.

నీవు అనేక roles play చేస్తావు. అవి play చేస్తూ...

నేను ఫలానాగా నిద్రలోకి వెళ్ళగలవా? మెలకువ లోకి రాగలవా? No Chance.

మెలకువలోకి వచ్చాక ఏ దృష్టితో ఆపాదిస్తే ఆ role play.

అభ్యాసం వల్ల, స్వభావం ఏర్పడటం వల్ల ఇవి వచ్చాయి.

స్వేచ్ఛ – 'ఉండుట' అనే ఒక్కదాని వరకే వుండు. Just being ness. అప్పుడు నీ expression నిన్ను బాధించదు కదా! No expression is hampering in sleep. ఇలా విశ్లేషణ, విచారణతో వుండుట వరకూ వుండు. సృష్టితో సమానమైన అవస్థలు, స్థితులు ఏవైతే వున్నాయో దానికేమీ ప్రమాదం లేదు. నేను దేని వెనుక పరిగెడుతున్నాను? అని గుర్తించుకోవాలి. పరుగు పందెం అయిపోయాక గుర్తిస్తే అప్పుడు లాభం లేదు.

Your Opportunity what you have got is lost.

వృద్ధాప్యం తీరిన ఆశలు, తీరని ఆశలు. 60+ అందరికీ ఇదే. ఇదేగా వృద్ధాప్యం అంటే. మనిషి వివేకాన్ని ఏమి వుపయోగించుకున్నాడు? కాబట్టి ఆదిశంకరాచార్యులు '**దేశకాలాతీతంగా మనిషి ఎలా వుండాలి?**' అనేదానితో చెబుతున్నారు.

"**యస్సాక్షాత్ కరణాద్....**" సాక్షిగా వున్నప్పుడు ఇంద్రియాలు తోస్తున్నాయా? లేదా? తోస్తున్నాయి. అతడు (ఆ సాక్షి) ఇంద్రియాలను మెలకువలో ఉపయోగిస్తున్నాడా? లేదా? ఉపయోగిస్తున్నాడు. నిద్ర పోవడం, మళ్ళీ మెలకువలో ఇంద్రియాలు తోస్తున్నాయి. అలాగే విశ్వం కూడా ఒక కాలంలో వస్తోంది, ఒక కాలంలో పోతుంది. ఇది పునరావృత్తి. ఇది ఆ వృతి. ఎప్పటి నుంచో జరుగుతోంది.

చిన్న నిద్ర, పెద్ద నిద్ర (మరణం). ఇది పునరావృత్తి. ఈ శరీరంలో మేల్కొంటూ వున్నాడు. లేవ లేదు అంటే ఇంకో శరీరంలో లేస్తాడు. మరణాన్ని ఇలా చూడాలి. అసంతృప్తితో, అవగాహన లేని దృష్టితో చూసినప్పుడు **భవాంభో నిధౌ** = సముద్రము.

గురువు అలాంటి జనన మరణాలకు సంబంధించిన పునరావృత్తిలో నుండి నిన్ను బయిట పెడుతున్నారో, దానికి ఏ గురువు సహాయం చేస్తున్నారో, నీవు సాక్షిత్వ స్థితిలో నిలబడటానికి అడ్డంకులను ఎవరు పరిష్కరిస్తున్నారో, ఆ జనన మరణ సమస్యను అధిగమించే స్థితిని కల్గించే ఆ గురువు దక్షిణామూర్తి. గురువులందరిలోను పని చేసేది దక్షిణామూర్తే. ఆయన దేనికీ స్పందించరు. స్పందించని స్థితి. దక్షిణః అమూర్తః. ఆకారం లేదు. నిరాకారం, నిరంజనం, నిర్వికారం... అవన్నీ దక్షిణామూర్తి లక్షణాలే.

జనన మరణ పునరావృత్తిలోకి రాకుండా చేయగల్గేది దక్షిణామూర్తి. మనం '**స**'కారంలో వున్నాము. సకారం నుండి నిరాకారానికి రావాలి. ప్రవృత్తి నుండి నివృత్తిలోకి రావాలి. అప్పుడు పునరావృత్తి దోషం పోతుంది.

**రజోగుణం** పనిచేస్తున్నంత సేపూ **ప్రవృత్తి** మార్గం.
**సత్వగుణం** పనిచేస్తున్నంత సేపూ **నివృత్తి** మార్గం.

లక్ష్యం మోక్షం అంటే పునరావృత్తి రహితం చేసుకోవాలి. మళ్ళా రాకుండా ఎలాగో చూడు. ఏది వస్తుందో, ఏది పోతుందో కనుక తేలిపోతే నీవు రానివాడివని గనుక నిరూపించబడితే, అది నీకు నిర్ణయం అయితే వచ్చి పోయేదాని వల్ల నీకు problem లేదు. ఇలా వచ్చిపోవడం అనేది మొదట నిద్రా మెలకువతో మొదలవుతుంది. ఇది నీకు అతి దగ్గరగా వుంది. రాకడ, పోకడ గుర్తించే అవస్థాత్రయాన్ని అధిగమించాలి. దీనితో మొదలు పెట్టాలి. దీనితో నీకో తెలివి వస్తుంది. ఆ తెలివితో విశ్వం రావడం, పోవడం చూడాలి. అప్పుడు దానిని అధిగమించుతావు. అప్పుడు శాశ్వతంగా వుండిపోతావు. నిర్గుణం. నామరూపాలు లేవు కదా! రాకడ, పోకడ లేనిదాన్ని గురించి చెప్పాలంటే 'ని'కార శబ్దంతోనే చెప్పారు. ఉదా: నిరుపాధికం.

నిరుపాధికం అనే దానిని నిరూపించాలి అంటే, నిరూపణ అంటే రూపం ...

నిరూపణ అంటే రూపంలేని స్థితిలో ఎలా వుందో తెలిస్తే తప్ప ఎలా నిరూపించుతావు?, రూపం లేని స్థితిలో ఎలా వుందో తెలిస్తేనే నిరూపణ. అది గ్రహించడానికి ఈ నిజ జీవితంలోనే ప్రయత్నించాలి. హిమాలయాల్లోకి, అడివిలోకి ఎక్కడికి వెళ్ళినా ఇదే అవస్థాత్రయం. నీ వివేకాన్ని ఉపయోగించుకుని నీ నిత్యజీవితంలో సాక్షిగా వుండడం ఎలాగో, ఆ సాక్షిని ఎలా పోగొట్టుకోవాలో తెలుసుకోవాలి.

సాక్షిగా వుంటే దృష్టి మారుతుంది. సృష్టిని మార్చలేం గాని, దృష్టిని మార్చుకోవచ్చు కదా!

**బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాక్ నిర్వికల్పం పునః**
**మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతమ్**
**మాయా వీవ విజృంభయ త్యపి మహాయోగీవయః స్వేచ్ఛయా**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 2**

విత్తనంలో మహావృక్షం దాగి ఉన్నట్లుగా గోచరించే ఈ మహా విశ్వమంతా దేశకాలావృతమైన సమస్త చరాచర జగతినీ, ఇంద్రజాలికుని వలె అటులనే మహాయోగివలె, బహిర్గతం చేసి తన మాయాశక్తితో స్వేచ్ఛగా జగన్నాటకాన్ని నడిపే మహాత్ముడైన నా గురువునకు, శ్రీ దక్షిణామూర్తికి ఇదే నా నమస్కృతులు.

**-:వివరణ:-**

మొదటి శ్లోకంలో వ్యష్టికి చెప్పారు. రెండో దానిలో సమిష్టికి చెబుతున్నారు.

ఈ ప్రపంచం అంతా ఎలా వచ్చింది?

ఒక చిన్న మర్రి విత్తనం నుండి చెట్టు వచ్చినట్లుగా,

విత్తనంలో వున్న చెట్టును ఎవరూ చూడ గలగటం లేదు కదా!

ఈ సృష్టి అంతా కూడా నిర్వికల్పం అనే బీజం నుండి వచ్చింది.

ఈ సృష్టి ఏర్పడక ముందు నిర్వికల్పం వుంది. (**ప్రాక్**=ముందు).

ఆ నిర్వికల్పస్థితి నుండే ఈ అనంత సృష్టి వస్తోంది.

ఈ ప్రపంచంలో దేశము, కాలము, కలన

(జీవితం, ప్రవర్తన = కలన) కనిపిస్తున్నాయి.

**దేశ**ము: ఇది కూడా అన్ని చోట్లా ఒకేలా ఉండదు కదా.

**కలన**: అందరికీ మెలకువ, నిద్ర సమానం. నీ దేహస్థితిని బట్టి నీ role play బట్టి నీవు అవి. నిద్రలో నిర్వికల్పస్థితిలోకి వెళ్తున్నావు. నీ నిద్రానుభవంతో సాక్షికేమీ పని లేదు. సాక్షి నిర్వికల్పంగా వున్నాడు. దేశం, కాలం అనుకూలించినప్పుడు మర్రి విత్తనం నుండి చెట్టు వస్తున్నది. అలాగే ఈ అనంత విశ్వము కూడా.

నీ గాఢ నిద్రావస్థలో సాక్షినీ, మెలకువలో కనపడే విశ్వాన్ని ఎలా పోల్చుతావు?
నీ లక్ష్యం ఎప్పుడూ నిర్వికల్పస్థితికి వెళ్ళడమే.
మాయ అంటే విచారణ చేస్తే లేనిదని నిరూపించబడింది.
జ్ఞానం అంటే విచారణ శక్తి కలది.

ఈ ప్రపంచం అంతా జ్ఞానం ఉన్నవాడికి పిల్లలాటల పోలికాయెను. మాయ ఇదంతా సృష్టించిందని ఏమీ చెప్పలేదు. విచారణాశక్తి లేని దశలో ఆట బొమ్మలు ఆనందాన్ని ఇచ్చాయి. ప్రపంచంలో ఎక్కడ చూసినా దేశం, కాలం, కలన ఈ మూడూనే.
కలన – different different roles.
అనంత విశ్వం చూస్తే విశేషమైన చిత్రాలను సృష్టిస్తున్నట్లుగా కనిపిస్తుంది, ఆ దృష్టితో చూస్తే. దేశకాల కలనలో మునిగిపోయినట్లనిపిస్తుంది. చిత్రంలో మునిగినట్లు పిల్లలాటల పోలికాయెను.
**వైచిత్ర చిత్రీకృతం**: పిల్లవాడు చిత్రీకరించిన దానిలో ఆ గీతలలోనే వాడు ఊహించిన బొమ్మ వుంటుంది. దాన్ని పిల్లవాడు ఎలా ఆనందిస్తున్నాడో నీవు ప్రపంచంలో వుండి అలాగే ఆనందిస్తున్నావు. వైచిత్ర చిత్రీ కృతం. వివేకాన్ని ఉపయోగించి వైచిత్ర చిత్రీకృతం నుండి బయటకు రావాలి. ఒక దేశం, ఒక కాలం, ఒక పాత్ర నుండి బయటకు రావాలి. ఇంతకుమించి ఏముంది? Lowest of the lowest చూసినా, highest of the highest చూసినా ఎన్ని జీవితాలు పరిశీలించినా ఎక్కడ చూసినా అలాగే ఉంది కదా! అందరికీ నిద్రామెలకువలు, సుఖదుఃఖాలు, అవస్థలు అన్నీ same. చూస్తే అధికో విశేషః – వివేకం. ఈ వివేకం దేనికి ఉపయోగడాలి? ఆ నిర్వికల్పస్థితి నుండి సమస్త ప్రపంచాన్ని చూస్తున్నాడు.
**మహాయోగి**: మహా అంటే నిర్వికల్పస్థితి. నిర్వికల్పస్థితిలో నున్నవాడు. ఆ నిర్వికల్పస్థితిలో నున్నవారికి సమస్త ప్రపంచము ఎలా కనిపించింది? దేశ కాల కలనా వైచిత్ర చీత్రీకృతం. దేశం, కాలం, కలన మూడు కలిసిపోయి చిత్రంగా వుందట. సమస్త విశ్వాన్ని నిర్వికల్ప స్థితినుండి చూస్తే, ఈ సర్వ ప్రపంచం నుండి, అనంత విశ్వం నుండి స్వేచ్ఛలభించింది

వారికి. దేశము, కాలము, కలన అనేవాటితో చేసే వ్యవహారమంతా లేదు. దానితో అతనికి ఏ ఆనందమూ లేదు. నిర్వికల్ప స్థితిలో ఆనందం లేదు.

ఆత్మ అన్నా, బ్రహ్మమన్నా నిర్వికల్ప స్థితిలోనే కదా! ఇప్పుడు ఆత్మానందం, బ్రహ్మానందం అనకూడదు. (నిర్వికల్ప స్థితిలో) ఇక్కడ ఆనందం వుంటే, అనుభవించేవాడు వుంటే, మళ్ళీ దేశ కాల కలన వస్తుంది. సంకల్పమే ప్రేరణ. అది వున్నంత వరకూ అనుభవించేవాడు ఉంటాడు కదా! నీ నిద్రానుభవంలో, ఆనందం వరకూ నీవు జీవుడివే. కానీ నిర్వికల్పస్థితిలో ఏ ఆనందము లేదు. వాడికి అవస్థాత్రయంలో వచ్చే సంకల్ప వికల్పాలతో పనిలేదు. వాడు దాన్ని ఆనందించటం, వ్యవహరించటం లేదు. ఒక వేళ వ్యవహరిస్తున్నా ఇంద్రియాలు చేస్తున్నాయి. (మూడు గుణాలు) ఇంద్రియాలు వ్యవహరిస్తున్నాయి. తాను జీవిస్తున్నాను అనుకోడు. నేను నిద్ర పొందటం లేదు, నిద్ర మానటం లేదు. సృష్టి ప్రవాహం జరుగుతోంది. నేను సంకల్పానికే సాక్షిని అని, నాకు సంకల్ప వ్యవహారం లేదు. (సర్వ సాక్షి అన్నా అవన్నీ నిర్వికల్పానికి పేర్లే) అని ఆ నిర్వికల్ప స్థితినే పొందాలి ఎవరైనా. ప్రపంచంలో ఎవరి లక్ష్యం అయినా నిర్వికల్పమే కదా! సాధనలు అన్నీ దానికోసమే. యోగ లక్ష్యం కూడా నిర్వికల్పమే కదా!

'**హఠయోగం**' అంటే సృష్టి ధర్మంగా జరిగేదాన్ని జరగకుండా ఆపడం. సృష్టి ధర్మం ప్రకారం జనన మరణాలు జరుగుతున్నాయి. పుట్టినవాడు పోకుండా ఉంటాడా? పతంజలి life prolong చేసుకోవచ్చని, శరీర ఆరోగ్యం కోసం అనే అంశాన్ని చెప్పలేదు. ఆ దృష్టికోణంలో చెప్పలేదు. ఇవన్నీ ఈరోజు వచ్చిన వైపరీత్య భావనలు. వాస్తవానికి అక్కడ అవి లేవు.

నీవు నీకున్న సంకల్ప వికల్పాత్మకమైన వ్యవహారాన్ని హరించు. హరించాల్సినవి ఇవి. ఇవి హరిస్తే అపుడు నిర్వికల్పమైంది. దాని కోసమే యోగం. మిగిలిన ఏ అంశంకోసం యోగం కాదు. యోగ లక్ష్యం ఇదే. యోగాన్ని మిగిలిన వాటికి వాడకూడదు.

మహానుభావులు ఇచ్చిన యోగ దర్శనాన్ని మనం దేనికి, ఎలా వినియోగించు కుంటున్నాం? మన ఇష్ట ప్రకారం వ్యాఖ్యానం చెప్పుకుంటున్నాం.

శాస్త్రాన్ని అలా వాడుకుంటే ఎలా?

తర్వాతి తరాలకు నీవే కదా మార్గదర్శనం. నీవే అలా చెబితే (విక్షేప దృష్టితో) మానవాళికి ద్రోహం చేసినట్లు కదా! కాబట్టి **ఎవరైతే ఆచార్య పదవి చేపడుతారో వారికి లక్ష్యం తెలిసి వుండాలి. అనుభవ జ్ఞానము వుండాలి**.

**యోగీవయః స్వేచ్ఛయా**: దీనిలోనుండి బయటకు రావాలంటే దేనిని లక్ష్యంగా తీసుకోవాలి? నిర్వికల్ప స్థితిలోకి రావాలి. అప్పుడు మహాయోగి అవుతావు. అప్పుడు నీకు జనన మరణాలు అనే చక్రభ్రమణం నుండి స్వేచ్ఛ. దేశ కాల కలనా అనే అంశం నుండి నీకు ముక్తి లభిస్తుంది. ఇప్పుడు ఎవరిని ఆశ్రయించాలి? ఈ స్వేచ్ఛనిచ్చేవారు ఎవరో ఆ గురువును నీవు ఆశ్రయించాలి. అతడు నిద్రా మెలకువలు, విషయాలు, వ్యవహారాల చేత బాధింపబడుతున్నాడా? అని విచారించి, గురువు అనుకున్న వారితో కలసి కొంతకాలం జీవించి. వారి జీవితాన్ని చూసి, వారి వద్ద నిర్వికల్ప స్థితి ఉందో లేదో తెలుసుకుని వుంటే వారిని ఆశ్రయించాలి. నీకు నిర్వికల్ప స్థితి అనే లక్ష్యాన్ని బోధిస్తారు.

**యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే**
**సాక్షాత్తత్వ మసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్**
**యత్సాక్షాత్కరణాద్ భవేన్న పునరావృత్తి ర్భవాం భోనిధౌ**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 3**

తా. ఎవని వ్యక్తరూరం ఈ ప్రంపంచంగా స్ఫూర్తిస్తూ కూడా నిత్యసత్యమై ప్రకాశిస్తూ ఉంటుందో, శ్రద్ధతో శరణువేడిన వారికి తత్త్వమస్యాది మహావాక్యాలతో ఎవరు జ్ఞాన బోధ చేస్తుంటారో, ఎవరి జ్ఞాన బోధ వల్ల జనన మరణయుక్తమైన ఈ సంసారచక్రం నుండి ముక్తి పొందుతున్నారో, అట్టి పరమ పవిత్రమైన గురుమూర్తికి శ్రీ దక్షిణామూర్తికి ఇవే నా నమస్కృతులు.

**-:వివరణ:-**

ఇంతకు మించిన బోధ లేదు. ఇదే ఆఖరి బోధ. ఇంతకు మించిన జీవన లక్ష్యం లేదు. ఈ స్ఫురణతో నేను నిర్వికల్ప నిష్టుడనవ్వాలి. సర్వ సాక్షిత్వ స్థితిలో వుండాలి. రాకడ పోకడ లేని స్థితిలో వుండాలి అనే లక్ష్యాన్ని స్వీకరించడమే. శాశ్వతమైన, పునరావృత్తి రహితంగా వుండాలి. ఇదే ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవడం అంటే. ఇదే తత్ గురించి తెలుసుకోవడం. ఇదే మానవులకు ఉన్నతమైన లక్ష్యం. ఇదే సత్యం. ఇదే ఆత్మ అంటే. ఆత్మసాక్షాత్కారం అంటే నిర్వికల్ప స్థితిలో సహజంగా వుండుటయే. అవస్థల చేత, జనన మరణాల చేత, ప్రపంచం చేత బాధింపబడని నిర్వికల్ప స్థితిలో వుండువాడు, దేశ కాల కలపా చేత బాధింపబడని వాడు, ఇలాంటి వారు గురువు, సచ్ఛిష్యుడు కూడా. ఇది ఆత్మానుభావం అంటే.

అసత్ ఎలా తోచింది?
చంద్రుడు ప్రకాశిస్తున్నట్లు ఎట్లా కనపడుతోందో అలా. అసలు చంద్రుడి ప్రకాశం గుర్తించాలంటే పగలు రాత్రి వుండాలి కదా!

ఎవరైతే ఆత్మానుభవంతో, ఈ నిర్వికల్ప దృష్టితో చూస్తే వారికి ప్రపంచం, వ్యవహారం లేదు. శరీర వ్యవహారం, ప్రపంచ వ్యవహారం కనపడడం లేదు. వాడికి కేవలం నిర్వికల్పమే వుంది. '**సాక్షాత్ తత్వ మసి ఇతి వేద వచసా....**' అని ఇలాగ వేదం చెప్పింది. ఇదే తత్వమంటే. "**తత్వమసి**" అనే మహావాక్యం ద్వారా వేదం చెప్పింది. నిర్వికల్పస్థితిలో వుండమని అర్థం. తత్వమసి = నిర్వికల్ప స్థితి. ఇది గురు సాన్నిధ్యంలో ఆ సమయంలో శిష్యుడు ఆ స్థితిలో వుండాలి. అప్పుడు దేశ కాల కలనల ప్రభావం లేని స్థితిలో వుండాలి. అసలు వాటిని గుర్తించలేవు. సహజంగానే ప్రాణమనోబుద్ధుల ప్రేరణ లేదు. Complaint లేదు. నీవే లేనప్పుడు సమస్యలేదు. అప్పుడు అన్నింటి నుండి స్వేచ్ఛ లభించింది. అలా ఎవరుంటే వారు మహాయోగులు, వారే గురువులు. నీవు కూడా అదే. వాస్తవానికి నీవు కూడా అదే అనుభవించావు కదా! ఆ అనుభవానందాన్ని నిత్యజీవితంలో అనుభవించు. ఏ స్థితిలో వుంటే నీ శరీర ప్రాణ మనో బుద్ధుల ప్రభావం నీలో లేదో, ప్రపంచం ప్రభావం నీ మీద లేదో, ఏ సంకల్ప ప్రభావముండి ఆస్థితిలో వున్నావో, ఆ స్థితి కలిగిన వాడు సచ్ఛిష్యుడు. ఆ స్థితి బోధించే వారు గురువు. ఆ గురువు దక్షిణామూర్తే. ఆ నిర్వికల్పస్థితిని నిలుపుకోవాలి. ఉపాధులు లేవు. సాకారాన్ని తీసేస్తే నిర్వికల్పం. దక్షిణామూర్తి కృప చేత నీవిలా వుండగలిగావు. సాకారం అంటే సంకల్ప వికల్పాలు, దేశ కాల కలన వచ్చేస్తాయి. నిర్వికల్ప స్థితి నుండి ఒక మెట్టు దిగితే అన్నీ వస్తాయి. పోతే అన్నీ ఒక సారే పోతాయి. వస్తే అన్నీ ఒకసారే వస్తాయి. నిర్వికల్ప స్థితిలో వుంటే రాకడ, పోకడ లేదు. ఇలానే జీవితాన్ని వినియోగించు. ఇధి మానవ జీవితానికి శ్రేష్టమైన లక్ష్యం. ఈ లక్ష్యాన్ని, ఈ నిర్వికల్ప స్థితికి మానవుడొక్కడే సాధించగలడు. సాధించక పోతే మానవ జన్మ వృధా.

**నానాఛిద్ర ఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం**
**జ్ఞానం యస్యతు చక్షరాది కరణ ద్వారా బహిః స్పందతే**
**జానామీతి యమేవ భాంత మను భాత్యేతత్సమస్తం జగత్**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 4**

తా. ఎవని చైతన్యం, మనకళ్లు చెవులు మొదలయిన ఇంద్రియాలద్వారా, అనేక చిల్లులు కలిగిన కుండలో ఉన్న దీపకిరణాలవలె, పైకి ప్రసరిస్తూ ఉందో, ఏ చైతన్యం ప్రకాశించడం వలన ఈ సమస్త వస్తుమయ మహా ప్రపంచం అంతా తెలియబడుతూ ఉందో, అటువంటి దివ్యమూర్తి సద్గురువు అయిన శ్రీ దక్షిణామూర్తికి ఇవే నా సమస్కృతులు.

**-:వివరణ:-**

ప్రపంచం కనపడుతున్నట్లే, ఇంద్రియాలు అనుభవాన్ని ఇస్తున్నట్లే నాకు తోస్తుంది. ఆ ప్రపంచం లేదంటున్నారు. మెలకువ, జీవ వ్యవహారం లేదంటున్నారు.

ఉపమానం : 'నానా ఛిద్ర ఘటం'.

ఒక దీపం వెలిగించి, దాని మీద చిల్లులు కలిగిన కుండను బోర్లించు. అప్పుడు కుండ ప్రకాశించినట్లు వుంది కదా! కానీ కుండ ప్రకాశించదు కదా! అలాగే నీ శరీరం కూడా 9 చిల్లులున్న కుండ వంటిది. లోపల ఆత్మ ప్రకాశం వుంటేనే ఈ శరీరం ప్రకాశిస్తుంది. కుండలోనుండి ప్రకాశం బయట పడుతున్నట్లు, రంగుల ప్రతిబింబ ప్రకాశంతో, గోడ ప్రకాశిస్తున్నట్లుగా వుంది. గోడమీద ప్రకాశం నిజమని అనుకోవడం, ఎంత భ్రమో అలాగే నీ శరీరం 9 చిల్లుల కుండ, ఆ చిల్లుల్లో నుండి వచ్చిన ప్రకాశమే నిజమని అనుకోవడం పిల్లలాట లాంటిది.

లోపల జ్ఞాన ప్రకాశం వుంటేనే, ఈ కుండ ప్రకాశిస్తున్నట్లు కనిపిస్తుంది. ఈ శరీరాన్ని చూసి, ప్రతిబింబంగా వున్న ప్రపంచమే సత్యమని అనుకుంటున్నావు. అజ్ఞానావృతమైన ఆనందం అది. అలాంటి స్థితిలో ఇప్పుడు నీవున్నావు. శరీరం కుండలాంటిది అన్నారు కదా! అంతకుమించి ఏమీ లేదు.

పోయినప్పుడు కుండ పగలగొడుతున్నారు కదా!

ఇప్పుడు నీ దేహాన్ని భోగ్యవస్తువుగా అనుభవిస్తావా?

ఈ దృష్టితో చూడటం అలవాటు చేసుకో!

కుండ పగలడం ఎంత సులభమో ఇది పోవటం కూడా అంతే.

ఈ శరీరం చేసిన పనులను ఏకరువు పెట్టడం అజ్ఞానమే కదా!

**జ్ఞానమే 9 చిల్లుల్లో నుండి ప్రకాశించేది, ప్రసరించేది.**

లోపల ఆ జ్ఞానమే లేకపోతే ప్రకాశం ఎలా?
ఈ చిల్లులు ఏం చేయగలవు?
ఏమీ చేయలేవు.
ప్రాధాన్యత దేనికి ఇవ్వాలి?
జ్ఞానానికా? చిల్లులకా?
దేనికి ప్రాధాన్యత ఇస్తున్నాం?

మాయ, భ్రాంతి ఎందువల్ల వచ్చింది?

ఈ శరీరం సత్యం అనుకోవడం, కుండ అనుభవాన్ని ఇస్తుందనుకోవడం వల్ల. కుండ అనుభవాన్ని ఇవ్వలేదు. లోపల జ్ఞానం ప్రసరించకపోతే నీ జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాల ద్వారా ఆ జ్ఞానం ప్రసరించకపోతే, నీ జ్ఞానేంద్రియ కర్మేంద్రియాల ద్వారా ఆ జ్ఞానం ప్రసరించక పోతే ప్రకాశం ఏది? నీకు అనుభవాన్ని ఇచ్చేది ఏది? లోపల వున్న జ్ఞానమే కదా! నీ లెక్కప్రకారం కుండ అనుభవాన్ని ఎందుకు ఇవ్వడం లేదు? నిద్రలో నీకు అనుభావన్ని ఇవ్వలేదు. జ్ఞానం ఒక తెర వెనక్కు పోయింది. నీ లెక్క ప్రకారం కుండ ఎప్పుడూ అనుభవాన్ని ఒవ్వదు కదా! ఒక చిత్రాన్ని చూసి బాగుందనుకోవడం అజ్ఞానం. ఇంద్రియానుభవం అదేగా చెప్పేది. ఒకటి బాగుంది, ఒకటి బాగాలేదు. ఈ అనంత సృష్టినీ చూచి ఇది బాగుంది, ఇది బాగాలేదు అనుకుంటావు కదా! రెండూ అసత్యాలే కదా! ఇలా చూడడం అలవాటు చేసుకోవాలి.

**నిర్వికల్పస్థితిలో వున్నవాడు ప్రపంచాన్ని ఎలా చూస్తాడు?**

9 చిల్లులు వున్న కుండవలె చూస్తున్నాడు.

తాను ఎవరు?

ఆ జ్ఞాన ప్రకాశము.

తాను లేకపోతే ఈ 9 చిల్లుల కుండకు ప్రాధాన్యత ఏమీ లేదు. చనిపోయినప్పుడు దేనికోసం ఏడుస్తున్నారు? నీవు అడుగుతున్న శరీరం అక్కడే వుంది. ప్రాణం – ఎప్పుడూ కనపడలేదు, చైతన్యం పోయింది. దాన్ని బ్రతికి వుండగా ఎప్పుడు గమనించావు కనుక? మరి దేనికోసం ఏడుపు? పిల్లలాటల పోలికాయెను. పరమ అజ్ఞానం కదా!

(ఆ జీవితో జీవించిన కొద్ది కాలంలో ఏవో కొద్దిపాటి విశేషాలు, మాటలు, చేష్టలు, పనులు, సుఖాలు గుర్తుతెచ్చుకుని, నీతో కలిసి జీవించిన ప్రతిబింబ సౌఖ్యం ఇప్పుడు లేదని ఏడవటం).

**ఈ ప్రపంచంలో ఏ దుఃఖం వెనుకైనా అజ్ఞానమే.**

**అజ్ఞానం వెనుక అహంకారం వుంది.**

**అహంకారం వెనుక జీవభావం వుంది.**

నిర్వికల్ప నిష్ఠుడికి ఇవి లేవు. నిర్వికల్ప స్థితిని పట్టుకుంటే ఇవన్నీ లేవు. ఈ ప్రపంచంలో ఎవరైతే ఈ ఒక్క లక్ష్యాన్నీ పట్టుకున్నారో వారికి దుఃఖం లేదు. అజ్ఞానం, అహంకారం, జీవభావం కూడా లేవు. ఈ ఒక్క లక్ష్యాన్ని పట్టుకోవడము తేలిక.

**'నిర్వికల్పస్థితిలో వున్నవాడు ఎలా చూస్తాడు?' - ఈ దృష్టిని అలవాటు చేసుకో!**

చిల్లుల కుండ ఉపమానం గుర్తుండాలి.

ఇలా నిన్ను, నీ ప్రపంచాన్ని చూసినట్లయితే అజ్ఞానావరణము తొలుగుతుంది.

ఏ ప్రపంచమైతే వుందని, నీ శరీరం వుందని నీవు అనుకుంటున్నావో అవి రెండూ మిథ్యాసత్యాలు. ఇవి వున్నాయనుకోవడం అజ్ఞానం.

ఇంద్రియాల ద్వారా ప్రసరించిన ప్రకాశంతో తెలియబడిన ప్రపంచంగా ఆ కుండ లోనుండి బయటకు ప్రతిబింబించిన ప్రకాశం ప్రపంచంగా, ప్రపంచం ప్రకాశిస్తున్నట్లు కనపడుతుంది. అజ్ఞానం తప్పుకుంటే ఇవన్నీ లేవు. లోపల వున్నది ఆత్మ ప్రకాశాన్ని నీ ఉనికిగా గుర్తించాలి.

ఇలా తెలుసుకున్నవాడు ప్రపంచ అనుభవాన్ని ఎలా చూస్తాడు?

నిర్వికల్పస్థితిలో శరీర ప్రాణ మనో బుద్ధులు లేవు. జీవుడు లేడు. అందరికీ మనసు మీదే complaints. నీ ఇంద్రియాలలో మనసు కూడా ఒక భాగమే. ప్రత్యేకం ఏం లేదు. సామాన్యంగా చూడు. అది కుండలో భాగమే.

కాబట్టి (ఇలా ఎవరైతే)

నీ జీవితం, నీ గురించి గాని, ప్రపంచం గురించిగాని, సమస్త చావు పుట్టుకలతో సహా లేకుండా చేసారు. అది దక్షిణామూర్తి విధానం. మౌన వ్యాఖ్య ద్వారా, ఒక్క సూచన ద్వారా, ఒక్క ఉపమానం ద్వారా అందించుతారు. ఇలా ఎవరైతే నిర్వికల్ప స్థితి బోధిస్తున్నారో వారే దక్షిణామూర్తి.

**దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధించ శూన్యం విదుః**
**స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహమితి భ్రాంతా భృశం వాదినః**
**మాయాశక్తి విలాసకల్పిత మహా వ్యామోహ సంహారిణే**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 5**

తా. బుద్ధి పరంగా స్త్రీలవలె, చిన్న పిల్లల వలె, మూఢులవలె విషయాల నర్థం చేసుకునే శక్తిహీనులు, మాయా ప్రభావానికి లోనై, శరీరమే సత్యమనీ, ప్రాణమే సత్యమనీ, ఇంద్రియాలనే సత్యమనీ, మనస్సే సత్యమనీ, నిత్యమూ మార్పు చెందే బుద్ధే సత్యమనీ, శూన్యమే సత్యమనీ శాస్త్రం నుండీ తప్పుగా గ్రహిస్తారు. అట్టి వారి భ్రమలను తొలగించ గలిగే పరమ గురువుకు శ్రీ దక్షిణామూర్తికి ఇవే నా ప్రణామాలు.

**-:వివరణ:-**

దేహం, ప్రాణం, ఇంద్రియాలు వాటి యొక్క చలనం వుందంటున్నావు. అదంతా శూన్యమే. పై విధంగా ఎవరైతే నిర్వికల్ప స్థితిలో వున్నారో, వారికి వీటి చలనాలు లేవు. ఇంకా ఏమేమి లేవు. స్త్రీలు, బాలురు, అంధులు, జడులు మిగితా అన్నింటిలో, సమస్త భేదములను గుర్తించి అంధుని వలె వున్నాడు. అన్ని పదార్థాలను జడంలా చూస్తాడు. నిర్వికల్ప స్థితిలో వున్నవారు, తన వద్దకు వచ్చిన వారికి, కనిపిస్తూ వున్నది ఎలా లేదో చెబుతారు. ఆయన జీవితకాలం అంతా ఎలా లేదో చెబుతారు.

**"ఇది మాయ, అజ్ఞానం. నీలో వున్న అజ్ఞానం వల్ల వున్నట్లు కనిపిస్తున్నాయి. నా దృష్టి కోణంలో బయటకు వచ్చి చూడు, లేకుండా పోతాయి. మాయ లేనిది"** అని

ఇదంతా, ఈ మహత్తంతా, ఈ అనంత విశ్వం, ఒక శక్తి చేత నిర్మితమైంది. నీవు జడం కాదు, చేతనం కాదు. నిర్వికల్ప నిష్ఠుడవు. నీలో ఏ చలనమూ లేదు.

**వ్యామోహం** = విశేషమైన మోహం = వదల్లేక పోవడం.

ఈ శరీరం, ప్రపంచం ఇచ్చే సుఖ దుఃఖాలు వదల్లేక పోవడం మోహం.

Ultimate గా అవి ఇచ్చేది సుఖదుఃఖాలే.

**సంహారిణే** = మూలంతో సహా లేకుండా చేయడం. ఆ సర్వసాక్షి స్థితిలో నిలబడితే పదార్థ ప్రభావం, చైతన్య ప్రభావం నీ మీద వుండదు. లేవు. అలాంటి స్థితిని బోధించే వారు దక్షిణామూర్తే. వారిని ఆశ్రయించు.

8 రకాల గురువులున్నారు. 'బోధక, విహిత, వేదక, సూచక....'
ఎవరిని ఆశ్రయించాలి?

అవస్థల, ఇంద్రియ, ప్రపంచ ప్రభావాలు లేకుండా నిర్వికల్ప స్థితిలో నున్నవారిని. (ఆశ్రయించాలి).

**రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛాదనాత్**
**సన్మాత్రః కరణోప సంహరణతో యో-భూత్సుషుప్తః పుమాన్**
**ప్రాగస్వాప్సమితి ప్రబోధ సమయే యః ప్రత్యభిజ్ఞాయతే**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 6**

తా. గ్రహణ సమయంలో సూర్యచంద్రులు రాహువుచే కప్పబడినట్లుగా, సర్వేంద్రియ వ్యవహారాలూ ఉపశమించిన సుషుప్తి అవస్థలో ప్రవేశించి మాయావరణతో కూడిన సత్యం సన్నిధిలో విశ్రాంతినంది మళ్ళీ మెలకువలో తాను నిద్రపోయినట్లుగా తెలుసుకునే పరమసత్యానికి శ్రీ దక్షిణామూర్తికి ఇవే నా ప్రణామాలు.

**-:వివరణ:-**

సూర్యుడు, చంద్రుడు కూడా గ్రహణాలకు లోనవుతున్నట్లు నీకు కనిపిస్తోంది కదా! సూర్య, చంద్ర గ్రహణములు వాస్తవానికి లేవు. వాటి మీద ఒక ఛాయ కనపడుతున్నట్లుగా వున్న ఛాయా గ్రహణములు మాత్రమే. రాహువు అంటే ఛాయ అని అర్థము. చంద్రుడు, సూర్యుడు లేకుండా పోలేదు. ఒక ఛాయామాత్రంగా తాత్కాలికంగా కప్పుతాయి.

అలాగే నీ శరీరం కొద్దిసేపు ఆవరిస్తే మాత్రం నీ జ్ఞాన ప్రకాశం పోయిందా?

అలాగే నీ శరీర ప్రభావం, ప్రపంచ ప్రభావం చేత నీవు పరమాత్మను దర్శించ లేకుండా వున్నంత మాత్రానా పరమాత్మ లేకుండా పోతాడా?

నీవు విచారణ లేకుండా తిరగటం వల్ల, అక్కడ సూర్య చంద్రులు ఎలా లేరు అనుకుంటున్నావో, ఇక్కడ కూడా నీ జ్ఞాన ప్రకాశం లేదంటున్నావు.

తత్ + మాత్ర = తత్ అనే జ్ఞానం,

పరమాత్మ లేకుండా పోతుందా? తన్మాత్ర లేకుండా పోతుందా?

తాత్కాలికంగా వున్న శరీరం వల్ల, ప్రపంచం వల్ల ఏ ప్రభావం లేని నిర్వికల్ప స్థితి లేకుండా పోతుందా? ఆ పరమాత్మ స్థితి, ఆత్మస్థితి లేకుండా పోతుందా?

పోదు. ఎలాగా? మళ్ళీ ఒక ఉపమానం చెప్పారు.

"**కరణోప సంహారణతో యోభా సుషుప్తః పుమాన్**...."

నీ సుషుప్తిలో నీ ఇంద్రియాలు, కరణాలు ఎలా లేకుండా పోతున్నాయో అలా నిద్ర అనే (ఆవరణ) ఛాయ నిన్ను ఆవరించినప్పుడు నీ తెలివిని కోల్పోతున్నావు.

సూర్యప్రకాశం గ్రహణ సమయంలో ఎలా పోతుందో తాత్కాలికంగా, అలాగే నీకు రోజూ నిద్ర అనే ఛాయ ఆవరించినప్పుడు ఏమీ చేయలేదు. అది నీడవంటిది.

శరీరం నీకు ఎలా అనుభవాన్ని ఇచ్చింది?

నీడ నీకు అనుభవాన్ని ఇస్తుందా?

నీ శరీరం ద్వారా వచ్చిన అనుభవం శూన్యం. అది నీడ వంటింది.

ఇంత సామాన్యంగా చూడటం అలవాటు చేసుకో.

## కర్తృత్వ భోక్తృత్వాలతో కూడినదంతా నీడ వంటిది.

**పండితులు ఎవరు?**

ఏ ఆధారం చేత ఈ సమస్త ప్రపంచము నడుస్తుందో ఆ ఆధార స్థితిలో వున్నవారు పండితులు. వారే గురువు. వారిని ఆశ్రయించి సహజ నిర్వికల్ప నిష్ఠుడవుకా. ఇదే '**ఈశ్వరో గురురాత్మేతి మూర్తి భేద విభాగినే**....' ఆ దృష్టితో చూడు. సాకార దృష్టితో చూడకు. ఇది నీకు ఎప్పుడు బోధ పడాలి? నీవు గురువు వద్ద బోధ పొంది, స్వీకరించినప్పుడు రావాలి.

"**ప్రాగస్వాప్సమితి ప్రబోధ సమయే యః ప్రత్యభిజ్ఞాయతే**..."

**జ్ఞ** = తెలియడం, **అభిజ్ఞ** = నీవు ఏదై వున్నావో ఆ స్థితి గుర్తు రావటం. **తత్వమసి** = అదే నీవు. తేడా లేదు. ఆ తత్ స్వరూపమే నీవైనప్పుడు నీవు నిర్వికల్ప నిష్ఠుడవే.

అంతటా జనన మరణాల కతీతంగా, అనంత సృష్టి స్థితులకు అతీతంగా ఏ ప్రత్యభిజ్ఞ అయితే వుందో అదే నేను. నాకు జనన మరణాలు లేవు. సృష్టి స్థితి లయాలు లేవు. ఇవన్నీ ఛాయా మాత్రమే. ఇటువంటి జ్ఞానాన్ని అందించే వారు దక్షిణామూర్తి.

**బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి**
**వ్యావృత్తా స్వను వర్తమాన మహమిత్యంతః స్ఫురంతం సదా**
**స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో భద్రయా ముద్రయా**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 7**

తా. బాల్య కౌమార యౌవన వృద్ధాప్య దశలలోనూ జాగ్రత్ స్వప్న సుషుప్తి మొదలయిన అన్ని ప్రాణులలోనూ ''నేను''గా ఉంటూ, తన భక్తులకు చిన్ముద్ర ద్వారా తన నిజ తత్త్వాన్ని వ్యక్తం చేసే సద్గురు మూర్తి శ్రీ దక్షిణామూర్తికి ఇవే నా ప్రణామాలు.

-:వివరణ:-

'**బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తదా....**' – ఇంకా ఏం చెప్తున్నారు? పుట్టిన దగ్గర నుండి పోయే వరకు బాల్యాది అవస్థలు, అవస్థా త్రయాం ఇవన్నీ నీ గురించి నీవు చెప్తున్నావు. నీవు, నీ ప్రపంచం గురించి, ఏం చేశావో, ఏం చేయదలచుకున్నావో అన్నీ, నీ అహం దేని మీద ముడిపడి వుందో నేను, నేను అని చేశాం ఇవన్నీ.

ఇప్పుడేం చేయాలి?

'**స్వాత్మానం ప్రకటీకరోతి భజతా....**' నీవు ఆత్మ స్వరూపాన్ని భజించాలి. దేనికోసం వచ్చావో, ఆ నిర్వకల్ప నిష్ఠను, స్థితిని అందుకోకుండా ఈ అనాత్మ వ్యవహారాన్ని భజించకు. ప్రవృత్తిని వదలు, నివృత్తిలోకి రా. ఎక్కడ దేన్ని భజిస్తే, ఏ స్థితిలో వుంటే నీకు భద్రత. ఏ ముద్రలో వుంటే నీకు భద్రత వుందో, అందులో ఉండవచ్చు. మహా బంధం వేయడమంటే కష్టం కాని, జాలంధర బంధనం అన్నింటి కంటే తేలిక, సులభం. జాలంధర బంధనంలో తెలివి బ్రహ్మరంధ్ర స్థానంలో పనిచేస్తూ వుండాలి. ప్రాణం క్రిందకే వుంది. జాలంధర బంధనం నుండీ శాంభవీ ముద్రలో దృష్టిని నిలపాలి. జాలంధర బంధనం వేసి పరమా శాంభవీ ముద్రలో ఉండాలి. పరమ శాంభవి (మూడూ వేస్తే శరీర ప్రక్రియ) మహాయోగివి అవ్వాలి, స్వేచ్ఛను పొందాలి అనే నిర్వికల్ప నిష్ఠను పొందు. నీలో వున్న ఇంద్రియాలు ప్రకాశం కాదు. నీలో వున్న జ్ఞాన ప్రకాశమే అంతటా వుంది.

**విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః**
**శిష్యాచార్య తయా తథైవ పితృపుత్రా ద్యాత్మనాభేదతః**
**స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయా పరిభ్రామితః**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 8**

తా. ఏ పురుషుడు మాయా ప్రభావం వలన జరుగుచున్న కార్యకారణ సంబంధరూపం అయిన విశ్వాన్నీ, శిష్యాచార్య విభేదాన్ని, పితృపుత్ర మొదలైన తేడాలనీ జాగ్రత్ స్వప్నావస్థలనీ విలక్షణంగా ఉండి విలాసంగా చూస్తున్నాడో, ఆ పరమ గురువుకి, శ్రీ దక్షిణామూర్తికి ఇవే నా ప్రణామాలు.

**-:వివరణ:-**

ఇప్పుడు విశ్వాన్ని ఎలా చూస్తున్నాము. విశ్వమనే కార్యం, దానికి కారణం లేదు. కార్యాన్ని ఉందనుకోవడం వల్ల కారణంగా ఈశ్వరుణ్ణి పెట్టాల్సి వచ్చింది. నిర్వికల్పస్థితిలో వున్నవారికి జీవభావం లేదు, ఈశ్వర భావం లేదు. జగత్తు లేనే లేదు. జగత్ జీవేశ్వరులు లేరు. అంతా గురువుగానే కనపడుతుంది.

గురువులో శిష్యుడు కలిసి వున్నప్పుడు గురువు, శిష్యుడు ఇద్దరున్నారా?

ఈ సమస్త విశ్వం లేనప్పుడు కూడా గురువు వున్నారు.

గురుశిష్య ఐక్యతా స్థితి పొందినప్పుడు నిర్వికల్పస్థితి, నిర్వికల్ప సమాధినిష్ఠలో ఈ భేదాలు సమసిపోయాయి.

అపుడేమయింది?

కలలో నుండి మేల్కొన్న పురుషుడికి కల వుందా?

అలా లేకుండా పోయింది. విశ్వం అనేకలలో నుండి మేల్కొన్నవాడికి ఎలా కల లేదో నిర్వికల్ప నిష్ఠలో వున్నవారికి అలా అనంత విశ్వం లేకుండా పోయింది.

**భూరం భాస్యనలో- నిలో-ంబర మహర్నాథో హిమాంశుః పుమాన్**
**ఇత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్**
**నాన్య త్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్ విభోః**
**తస్మై శ్రీ గురు మూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే 9**

తా. ఎవని అష్టమూర్తులైన భూమి జలము అగ్ని వాయువు ఆకాశం సూర్యుడు చంద్రుడు జీవుడు విరాజిల్లుతున్నారో, ఎవరు చరాచరమయిన జగత్తుగా వ్యక్తమవుతున్నాడో, ఎవనిని ఆరాధించి సర్వ వ్యాప్తమయిన ఆత్మతత్త్వం కంటే వేరుగా రెండవదేదీ లేదని సాధకులు తెలుసుకుంటున్నారో, అట్టి సద్గురువునకు శ్రీ దక్షిణామూర్తికి ఇవే నా ప్రణామాలు.

**-:వివరణ:-**

ఇప్పుడు సమిష్టికి చెప్తున్నారు. భూమి, చంద్రుడు, నక్షత్ర మండలం, విశ్వం అదంతా నీ సంకల్పంలో అంశీభూతం. నీ నిర్వికల్ప సమాధిలో అది కూడా లేనిదే. అనంత విశ్వం లేనిదే అని కూడా వుండాలి. వ్యష్టి లేదు అని మాత్రమే చాలదు.

(అష్ట మూర్తి రజా జైత్రీ ... అని లలితా సహస్ర నామాలలలో వస్తుంది. ఎనిమిది మూర్తులతో ఈ సమస్త ప్రపంచాన్ని పాలిస్తుంది).

పంచభూతములు, మనో బుద్ధి అహంకారములు కలసి అష్టమూర్తులుగా ఈ ప్రకృతి విరాజిల్లుతుంది. పంచభూత సముదాయమైన అనంత విశ్వము లేనిదయ్యింది. ఖగోళం, నక్షత్రాదులు లేనివే.

'**నాన్యత్ కించిత్**...' – నీవు తప్ప అన్యం మరొకటి లేదు. నీవు లేని వాడవు.

**యస్మాత్** = వున్నది,

**పరస్మాత్** = లేనిది.

అనంత విశ్వము కూడా లేనిదే.

ఉన్నదీ, లేనిదీ తెలుసుకునేవాడు లేడు.

**నాహం** = నేను కూడా లేను.

ఈ బ్రహ్మజ్ఞానంతో ఉన్నదేదో, లేనిదేదో తెలిసింది. అవగాహన అయిన నిర్వికల్ప సమాధి స్థితిలో చెప్పేవాడే లేడు. బ్రహ్మవిద్యతో ఉన్నదేదో, లేనిదేదో తెలిసింది. తెలుసుకునే వాడే లేడు. అందుకనే మౌనవ్యాఖ్య అనాల్సి వచ్చింది.

**సర్వాత్మత్వ మితి స్ఫుటీకృత మిదం యస్మాదముష్మిన్ స్తవే**
**తేనాస్య శ్రవణా త్తదర్థ మననాద్ధ్యానాచ్చ సంకీర్తనాత్**
**సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యాదీశ్వరత్వం స్వతః**
**సిద్ధ్యేత్ తత్పునరష్టదా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే** **10**

తా. సర్వాత్మతత్త్వం ఈ స్తుతిలో వివరించబడింది. కాబట్టి దీనిని విని మననం చేసి ధ్యానించి కీర్తించడంలో అష్టమూర్తులైనట్టి మహావిభూతి సిద్ధించును.

-:వివరణ:-

వీటన్నింటితో కూడిన ఈశ్వరుడు కూడ లేడు.
ఏ ఆత్మచేత ఈ అనంత విశ్వం ప్రకటింపబడుతోందో,
ఏ బ్రహ్మచేత ఈ అనంత విశ్వం నడుపబడుతోందో,
ఆ ఆత్మ బ్రహ్మలతో కూడిన
మహద్వాచకం అనే మహత్తు కూడ లేకుండా పోయింది.

ఇదే వేదాంత విజ్ఞానము.